# పిల్లలు - పెద్దలు

పిల్లలు స్వాతంత్ర్య పరిసరాల్లో పెరిగితే
అవుతారు నిజమైన పౌరులు
చిన్నతనం నుంచి "అది చేయవద్దు, ఇది చేయరాదు"
అని పెద్దలు ఆంక్షలు పెడుతుంటే
పిల్లల మెదడు వికసించే దెలాగు?
వారు నిజమైన పౌరులుగా తయారయే దెలాగు?
పిల్లల ఆసక్తికి పెట్టుతుంటే పెద్దలు గోడలు
వాళ్ళ విజ్ఞాన వికాసానికి కట్టుతుంటే అడ్డుకట్టలు
పిల్లలు కాగలరా స్వాతంత్ర్య వ్యక్తులు?

బడిలో ఆసక్తితో ప్రశ్నలు వేస్తే
"అల్లరి పిల్లలు" అంటే పంతుళ్లు వాళ్ళని,
ఇంటిలో విజ్ఞానాన్ని ప్రదర్శిస్తే
"తుంటరి మూకలు" అంటే పెద్దలు,
ఇంట్లో, బడిలో పెద్దలు చెప్పిన వాటన్నిటికీ
మెదడుకు పని పెట్టకుండా
ఆలోచనలకు తావు ఇవ్వకుండా
గంగిరెద్దులా తలఊపి "మీరు చెప్పిందే వేదాంతం"
"మేం వింటాం సొంతం" అంటేనే
అవుతారు మంచి పిల్లలు-పెద్దల దృష్టిలో!

మొక్క పెరుగుతుంది చిన్నవయస్సులో
పుష్పం వికసిస్తుంది మొగ్గ విచ్చినప్పుడే
పిల్లలు విజ్ఞాన వికాసాలు పొందుతారు చిన్నవయస్సులోనే
వారి మెదడుల వికాసానికి పెద్దలు అవకాశమిస్తే.

ఇంటిలో తల్లితండ్రులు
బడిలో పంతుళ్లు
సమాజంలో పెద్దవాళ్ళు
పిల్లల స్వంత ఆలోచనలను మొదట్లోనే తుంచివేస్తే
మొగ్గగానే విరిచివేస్తే
వారు కాగలరా ఆదర్శ పౌరులు ?
అవుతారా వికసించే పుష్పాలు ? చిగురించే వృక్షాలు ?
ఈ విషయం పెద్దలు గ్రహించిననాడే
పిల్లలు కాగలరు నిజమైన మనుషులు, సరియైన పౌరులు.

పిల్లలు ఏమి ఎప్పుడు తినాలో
ఏమి బట్టలు ఎలా ధరించాలో
వాళ్ళు ఏమి చదవాలో, ఏమి చూడాలో
ఎప్పుడు ఎక్కడికి వెళ్ళాలో
ఎవరిని పెళ్ళాడాలో—
అన్నీ పెద్దలే నిర్ణయిస్తే
పిల్లలు మనుషుల్లా తయారవుతారా ?

జ్ఞాపకం ఉంచుకోవాలి పెద్దలు తాము ఒకనాటి పిల్లలే అని—
అందుకే పిల్లల మనసులు సరిగా అర్థం చేసుకోవాలి పెద్దలు.
ఆసక్తితో పిల్లల పత్రికలు చదువుతారు పెద్దలు
చూస్తారు పిల్లల సినిమాలను, వేడుకలను కళ్ళు విప్పుకొని.
అలాగే పెద్దల విషయాలు తెలుసుకోవాలని
ఉండదా కుతూహలం పిల్లలకు ?

కారణం : ప్రతి పెద్దలోను ఒక శిశువు దాగిఉన్నట్లే
ప్రతి శిశువులోను ఒక పెద్ద అణిగి ఉండడం సహజం.

అందుకే పిల్లల ఆశలను, ఆశయాలను
అర్థం చేసుకోవాలి పెద్దలు
చేయాలి తగు సహాయం పిల్లలకు
ఇవ్వాలి వలసిన ప్రోత్సాహం
అప్పుడే పిల్లలు
పెరుగుతారు నిజమైన పెద్దలుగా.
జాతి ప్రగతికి పునాదులుగా.

—ఎల్. మాలకొండయ్య
1—3—1979

# దివ్వె

దీపము చిన్నదైనా
తరిమేస్తుంది కారు చీకటినైనా

విద్య అనే దివ్వెను
మనం వెలిగించుకుంటే
అజ్ఞానం అనే చీకటి
అవుతుంది మాయం.

అందుకని వెలిగిద్దాం
బాలల హృదయాల్లో
చదువుల పువ్వుల దీపాలను
వికసింపచేద్దాం తెలివి తేటలను

తరిమివేద్దాం దూరంగా
మనలోని మందబుద్ధిని
ప్రతి దివ్వె మారాలి ఒక దివ్య జ్యోతిగా
ప్రతి పాప మారాలి ఆజ్యోతికి ప్రతిరూపంగా.

# నవ్వు

నవ్వు పువ్వు లాంటిది
అందాన్ని అందిస్తుంది
ఆనందాన్ని వెదజల్లుతుంది
అందరినీ ఆకర్షిస్తుంది.

బాలుర నవ్వులు బారులు తీరిన బంతిపువ్వులు
బాలికల నవ్వులు వికసించే చేమంతి పువ్వులు
బాలబాలికల నవ్వులు పరిమళాన్ని వెదజల్లే పూబంతులు.

నవ్వు ముఖం నలుగురిని నవ్విస్తుంది
నవ్వుకు కారణం?
నలుగురి సుఖాన్ని పంచుకోవడమే!

తోటివారి బాధలు చూచి నవ్వితే
అది నవ్వు కాదు, నాగుపాము విషం.

పేదల బాధలు చూచి
ఆపదలో ఉన్నవారి ఆర్తనాదాలు విని నవ్వరాదు.
అట్టి నవ్వు అవుతుంది విషపు పువ్వు.

చందమామలాంటి పిల్లల ముఖాలు
వెన్నెలలాంటి వాళ్ళ నవ్వుల పువ్వులు
మనుషుల హృదయాలను
మందారాలుగా మారుస్తాయి.
వారి మనసుల్లో మమతలు విరజిమ్ముతాయి.

# మిత్రులు

మిత్రులు పలురకాలు
ప్రాణమిస్తారు కొందరు
ప్రాణాన్నే తీస్తారు మరికొందరు !
అక్కర తీరేదాకా
చక్కటి స్నేహితులు కొందరు !
అక్కర ఉన్నప్పుడే
అగుపించే మిత్రులు కొందరు !
సహాయం చేయడానికి చేస్తారు కొందరు స్నేహం :
సహాయం పొందడానికే చేస్తారు ఎందరో స్నేహం !
ఏరుదాటి తెప్ప కాలుస్తారు కొందరు
నదియేటిలో మునిగి పోతుంటే
తెప్పలా సహాయ పడతారు కొందరు.
మిత్రులులేని జీవితం ఎడారిలో మొక్కలాంటిది
స్నేహంలేని జీవితం చమురులేని దీపం లాంటిది.
ఇతరులు మనకు మిత్రులు కావాలంటే
మనం చూపాలి వారిపై శ్రద్ధ, ఆసక్తి
పలకరించాలి చిరునవ్వులతో
పిలవాలి వారి ముద్దు పేర్లతో
వినాలి శ్రద్ధతో వారు చెప్పేమాటలు
తెలుసుకోవాలి వారికి నచ్చే విషయాలు
చేయాలి తగు మర్యాద
ఇవ్వాలి వలసిన ప్రాముఖ్యత.
మనస్ఫూర్తిగా స్నేహ ధర్మాలను పాటించిననాడు
మనకు కొరత ఉండరు మిత్రులు !

# ప్రేమ

"ప్రేమ" !- ఎంత తీపైన మాట !
అక్షరాలు రెండే అయినా, ఎన్నో అర్థాలమాట !!

ప్రేమకు అర్థం మారుతుంది
ప్రేమించే వాళ్ళను బట్టి-

తల్లితండ్రుల ప్రేమ ఎల్లలు లేని ప్రేమ
పిల్లల ప్రేమ కల్లా కపటం లేని ప్రేమ.

దేవుడిపై భక్తుడి ప్రేమ దివ్యమైన ప్రేమ
స్నేహితుల ప్రేమ చెప్పనలవిగాని ప్రేమ.

ప్రేమ చేస్తుంది లోకాన్ని భూతల స్వర్గం
ప్రేమ లేకుంటే అవుతుంది స్వర్గమే నరకం !

మనిషి మీద నమ్మకం లేకుంటే మనిషిని ప్రేమించలేం
నిజమైన ప్రేమ మంచినే చూస్తుంది అందరిలో
ప్రేమ లేకుంటే కనిపిస్తాయి తప్పులే అందరిలో
ఫలించిన జీవితానికి ప్రేమే ప్రాణం !

# మనం

తల్లి భాషను
తల్లి దేశాన్ని
తప్పక ప్రేమిస్తాం మనం

ఎన్ని భాషలను ఆదరించినా
తల్లి భాషలోనే మాట్లాడుతాం

ఎన్ని దేశాలను గౌరవించినా
ప్రేమిస్తాం జన్మభూమినే.

మనుషులెందరో ఉన్నా
మనవారినే ప్రేమిస్తాం.

తల్లులందరిని గౌరవించినా
కన్న తల్లినే పూజిస్తాం.

"మన" అనే మాటలోనే ఉంది మాధుర్యం
"మనం" కలిసి ఉంచేనే
బాగుపడుతుంది మనదేశం.

# ఆట - విమర్శ

ఆటను విమర్శించడానికి ఆటలోని రుచిని
అందులోని అనుభవాన్ని
నియమాలను తెలుసుకోవాలి
ఆటలోని లోటుపాట్లు తెలియకుండా విమర్శిస్తే
ఆటకు, ఆటగాడికి చేస్తాం అన్యాయం.

కాని-విజ్ఞానంతో కూడిన విమర్శ
ఆటగాడికెంతో అవసరం
వేషగాడికి అద్దంలాగ -

ఆటగాడికి ఓటమి, గెలుపు ఒక్కటే
ఆట ఆడే పద్ధతిలో ఆడితే -
నియమావళి పాటించి ఆట ఆడి ఓడినా గొప్పే
నియమాలు తప్పి ఆట ఆడి గెలిచేకంటే !

మరువరానిది మరో విషయం
ఆటనేర్చి ఆడడం ఎంతకష్టమో
తెలియకుండా విమర్శించడం అంతసులభం !

అందుకనే -
ఆటగాడు ఎంత నేర్పరి అయినా
కావాలి కొంత విమర్శకు పాత్రుడు
విమర్శకుడు అలాగే పొందాలి కొంత మెలుకువ ఆటలో.

# ఆరుగురు మిత్రులు

బాలలే భారతదేశానికి
భవిష్యత్తు వెలుగులు అని
కలలు కన్నారు చాచానెహ్రూ.

బాలల కర్తవ్యం
మంచిగా విద్యలు నేర్వడం
మనుషులుగా తయారు కావడం.

దిద్దాలి పిల్లలు అవసరమైతే పెద్దలనైనా
తమ క్రమశిక్షణతో
నడిపించాలి సమాజాన్ని
అభివృద్ధి బాటలో
అందుకు కావాలి ఆర్గురు మిత్రులు

వారే-
ఏమిటి? ఎవరు? ఎందుకు? ఎప్పుడు? ఎక్కడ? ఎలాగ?
అనేవారు

అనాది నుంచీ
అందించ బడుతున్న వాటిని అన్నిటినీ
ఆదరించవలసిన అవసరంలేదు నేడు.

కాలదోషం పట్టిన వాటిని గుర్తించి
కడకు నెట్టేసుకుంటూ పోవాలి
అందుకు - వినాలి - చూడాలి
ఆలోచించాలి - ఆచరించాలి.

దానికి ఉపకరిస్తారు
మన అగ్గురు మిత్రులూ ;
తప్పక చేస్తారు సహాయం
అడిగితే మనస్సు విప్పి
వించే చెవి యొగ్గి.

పిల్లల అవసరాలు తీర్చే కార్యక్రమాల్లో
వాళ్ళకు ఉండాలి ఎంతో జోక్యం
పిల్లలు చేసేవన్నీ
అల్లర్లు కావని తెలుసుకోవాలి పెద్దలు.

బాలలూ ;
మీరు ఏమి చేయవలసినా
అడగండి తప్పకుండా
మీ అగ్గురు మిత్రులనూ -
ఏమిటి ? ఎవరు ? ఎందుకు ?
ఎక్కడ ? ఎప్పుడు ? ఎలాగు ? లను
ఇస్తారు మీకు కావలసిన సలహాలు
చేస్తారు తగు సహాయం.

# ఆసక్తి

ఆసక్తి ఎంతో అవసరం
అన్నీ తెలుసుకోవాలని
ఎన్నో నేర్చుకోవాలని
చిన్న నాటినుండి.

అన్నీ విచారించి తెలుసుకోకుండా
చెప్పినవన్నీ గుడ్డిగా నమ్మితే
సొంత జ్ఞానం తగ్గిపోతుంది.

విన్న వాటికీ కన్న వాటికీ
గంగిరెద్దులా తల ఊపితే
రాజాలదు విజ్ఞాన వికాసం.
ఆలోచించి ఆసక్తితో అన్నిటినీ
పరిశీలించి తెలుసుకోవాలి.

చెప్పినవన్నీ విని
చూచినవన్నీ గమనించి
అందులో మంచీ చెడూ విచారించి
నిజం అబద్ధం గ్రహించి
మరీ చెయ్యాలి ఏ పనులైనా.

# రోడ్డు

రోడ్డు లేకుంటే
చేయలేం ప్రయాణం.
రోడ్డుపైన నడవాలంటే
రూల్సు కొన్ని పాటించాలి.
లేకుంటే ఎన్నో అపాయాలు
ఎందరికో ప్రాణనష్టం !

నడి రోడ్డుపైన నడవరాదు
ఎడమ ప్రక్కనే వెళ్ళాలి
రోడ్డు దాటేటప్పుడు
కుడి ఎడమలు చూడాలి
నడిచే బండ్లకు అడ్డుపోరాదు
వేగంగా వెళ్ళేవాటికి దారి ఇవ్వాలి.
ఎటు తిరిగేది చేయి చూపాలి
హద్దులను అనుసరించి
రహదారి గమనాన్ని పాటించాలి.

రోడ్డు రూల్సు పాటించకుండా
కళ్ళు మూసుకుని
వళ్ళు మరచి నడిస్తే
కలుగుతుంది అపాయం ప్రాణాలకు
అనుభవించాలి నేరానికి శిక్ష.

# మట్టి - మనం

మట్టితో చేస్తారు రంగు రంగుల బొమ్మలు
వింతైన పాత్రలు, వినోద వస్తువులు.
మట్టితో పెట్టుతారు గోడలు
కట్టుతారు అందాల భవనాలు.
మట్టినుండే పండుతాయి పంటలు
వస్తాయి త్రాగే నీరు, కట్టేబట్ట.

కాని నేర్చుకోవాలి మనం
మట్టితో మెలగడం
మట్టిని మంచిగా వాడుకోవడం.

బడిని వదలగానే
మట్టిలో దూకుతారు పిల్లలు
పోసుకుంటారు కళ్ళలో
పూసుకుంటారు బట్టలకు,
తెచ్చుకుంటారు కయ్యాలు
మెచ్చుకుంటారా పెద్దలు ?

మట్టిలోనూ మట్టిపైనా మనం ఉన్నా
మట్టికీ మనిషికీ ఎంతో సంబంధం ఉన్నా
పట్టు బడరాదు మట్టికి మనం
కట్టుబడి ఉండాలి మట్టే మనకు.
మట్టిని ఉపయోగించుకోవాలి మనం
మట్టిలో మనం కారాదు మలినం.

# పరిశుభ్రత

ఇల్లు, ఒళ్లు, బడి, వీధి
ఉంచుకోవాలి పరిశుభ్రంగా.
కాళ్ళకు చెప్పులు వేసుకోవాలి
బయట తొక్కిన బురదను కడుక్కోవాలి.
ఇంట్లో, బడిలో ఉమ్మి వేయరాదు
ఉచ్చ దొడ్లు ఉపయోగించాలి ఆయాపనులకు
చెత్త, చీమిడి, చిరిగిన కాగితాలు
వెయ్యాలి చిత్తు కాగితాల బుట్టల్లో.
దగ్గినప్పుడు, తుమ్మినప్పుడు చేతిరుమాలు వాడాలి
మన ఇంట్లో మురికిని పక్క ఇంట్లో పడవేయరాదు.

ఆటలు ఆడిన తర్వాత చేయాలి స్నానం
ఒళ్ళు శుభ్రం లేకుంటే వస్తాయి జబ్బులు.
ఇల్లు శుభ్రం లేకుంటే
చేరుతాయి దోమలు, ఈగలు,
అవి తెస్తాయి అనేక రోగాలు.
పరిశుభ్రతే పిల్లల ఆరోగ్యం.
మురికి అందరికీ ముప్పే
అందువల్ల ఉంచుకోవాలి అన్నీ శుభ్రంగా.

ఆరోగ్యంగా జీవితాలు గడపాలంటే
ఉంచుకోవాలి ఒళ్ళు, ఇల్లు, పరిసరాలు పరిశుభ్రంగా. ఎల్లవేళలా!

# దోమ

## (i)

ఏమమ్మా
దోమమ్మా
చాలమ్మా దోమమ్మా
ఇక నీ సంగీతపు గోలమ్మా.

పాపాయి నిద్రను
పాడు చేయకు దోమమ్మా
ఇక ఆపమ్మా నీ ఆలాపం.
నిద్దుర పోనీ ముద్దుల పాపను
వద్దు నీకిక ఈ రక్త పిపాస.

మంచిగ పోకుంటే
మందులు కొట్టేస్తాం
నీ ప్రాణం తీసేస్తాం
నీ జాతిని కూల్చేస్తాం ॥మ॥

# దోమ
## (ii)

దోమంటే నాకెంతో ఇది
నేను నిద్రపోతే
అది రెక్కలు విప్పుతుంది
సంగీతం మొదలెడుతుంది చక్కగా
చటుక్కున నిద్రలేస్తాను
చెవిలో పాడుతుంది "గుయ్యిం" అని
చెంపను కాటేస్తుంది "చటుక్కు"మని
అమ్మ కడుతుంది దోమతెర
కమ్మగా దూరుతుంది అందులో
ప్రొద్దున్నే నిద్రలేచి చూస్తే
దద్దులు ఒళ్ళంతా.
మాస్టారు చెప్పారు
మలేరియా - బోదకాళ్ళు
వస్తాయి దోమల వల్లనే అని
అందుకనే దోమలమందు వాడాలి
ఎల్లవేళల దోమతెరలోనే పడుకోవాలి
కాచిన నీళ్ళే తాగాలి
మలేరియా, ఫైలేరియా రాకుండా
మందులు పుచ్చుకోవాలనీ-
దోమలు చిన్నవైనా
వాటివల్ల అపకారం మహా మహా పెద్దదనీ
చెప్పారు మాస్టారు మళ్ళీ మళ్ళీ.

# చేతికర్ర

చేతికర్ర కథ చెప్పాలంటే చాలా ఉంది.
చేతికర్ర తాతకు ఊతకర్ర
అల్లరి అబ్బాయిల పాలిట
అదొక మంత్రదండం ఒకప్పుడు,

ఉంటుంది చేతికి ఆయుధంగా
ఇస్తుంది శరీరానికి ఠీవి.
అవసర సమయాల్లో
ఆపద వేళల్లో
ప్రాణమిత్రుడు చేతికర్ర
మారణ ఆయుధం చేతికర్ర
మనిషికి రక్షణ చేతికర్ర!

గొర్రెల కాపరికి
పొలం దున్నే రైతుకు
ఒంటిగా పయనించే బాటసారికి
ఇంకా ఎందరికో ఎన్ని విధాలుగానో
చెప్పరానంత ఉపయోగం చేతికర్ర.
అందుకే-కర్ర లేకపోతే
గొర్రె కూడా కరుస్తుందంటారు పెద్దలు!

# చేతికర్ర



# తిండి

శరీరానికి శక్తి కమ్మని పిండి వంటల్లోనే ఉండదు
మంచి పళ్లు, పాలు, కూరగాయల్లోనే ఉంటుంది.

ఉంటాయి పిండివంటలు
తింటే కమ్మగా, తీపిగా
కాని ఉండాలి జాగ్రత్తగా
వాటితో కడుపు నింపేటప్పుడు.

విందులకు వెళ్ళినా
తగు మాత్రమే తినాలి తిండి
అజీర్తికి దారి తీసే విధంగా తిని
ఆపైని మందులు తీసుకోవడం కంటే
ఆరోగ్యానికి సరిపోయే విధంగా
అన్ని విటమినులు సమకూరే భోజనం తింటే
రావు జబ్బులు మన దోలికి

అన్నంలేని వారికి ఆకలి జబ్బు ఒక్కటే అయితే
అరిగించు కోలేనంత తినేవారికి అన్నీ జబ్బులే।
అందుకే తినాలి జీవించడానికి
జీవించరాదు తినడానికి మాత్రమే।

# మందు

మందు అవసరం రోగానికి
కాని రోగాలు రాకుండా చూసుకుంటే
అవసరమే ఉండదు మందులతో -
అందుకు చేయాలి శరీర వ్యాయామం
తినాలి వేళకు వలసిన తిండి
పాటించాలి క్రమబద్ధమైన అలవాట్లు.

శరీరానికి సహజమైన మందులు,
తగుపాళ్ళతో కూడిన విటమినుల భోజనం
సరియైన వ్యాయాసుం, విశ్రాంతి,
వారానికి ఒకరోజు ఉపవాసం.

కాని రోగాలు వచ్చినప్పుడు
మంచి డాక్టరు సలహా పొందాలి
సలహా ప్రకారం మందులు సరిగావాడాలి
లేకుంటే చెడుతుంది ఆరోగ్యం.

మంత్రాలతో మానవు రోగాలు
తంత్రాలతో నయంకావు జాడ్యాలు
ఆరోగ్య సూత్రాల పాటింపే
మంచి మందు అని తెలుసుకోవాలి మనం.

# ఆకాశం

ఆకాశం అంటే ఏమిటో తెలియదు
ఏకోశాన ఎంతో మందికి
ఆకాశంలో ఉన్నారు దేవతలు అని
అందులో ఉన్నాయి దేవలోకాలు అని
అనుకుంటూ ఉంటారు తెలియని వాళ్ళు.

ఆకాశం అంటేనే శూన్యం
అందులో లేదేమి అన్యం
అంటారు శాస్త్రజ్ఞులు-
ఆకాశం శూన్యం అయినా
అందులో మన ప్రపంచాన్ని మించిన
మరెన్నో ప్రపంచాలు ఉన్నాయని
అంటున్నారు ఖగోళ పరిశీలకులు.

మనం ప్రతిదినం చూస్తున్న సూర్యుడు
తారా మండలంలోని చుక్కల్లో
ఒక్క చిన్నచుక్కే అని నిరూపిస్తున్నారు వాళ్ల

చంద్రమండలం ఒక నీరు, గాలి లేనట్టి
ప్రాణికోటి జీవించలేని ఎడారి అని
తేల్చారు అక్కడికి వెళ్ళి వచ్చినవాళ్లు!

ఆకాశం అంటే శూన్యం అని
ఆ శూన్యంలో అనేక గోళాలు ఉన్నాయని
అది స్వర్గం ఏదీకాదని తెలిసింది ఈనాడు.

# దేవుడు ఒక్కడే

ఈశ్వరుడతడే
పరమేశ్వరుడతడే.
అందరి పాలిట దేవుడు అతడే
మన అందరి పూజా దైవం అతడే

అల్లా పేరుతో పిలిచినా
ఎల్లర చల్లగా జూచేదతడే
క్రీస్తు అతడే, కృష్ణుడు అతడే
గౌతము డతడే, గురునానక్ అతడే ॥ఈశ్వ॥

పెద్దల పిన్నల బ్రోచే దతడే
వద్దుగ జగతిని నడిపే దతడే ॥ఈశ్వ॥

ఎండా గాలిని మనకు
విందుగ ఇచ్చేదతడే ॥ఈశ్వ॥

జీవకోటికి జీవము నిచ్చి
ప్రాణికోటికి అభయము నిచ్చి
జగతిని కాచేదతడే
ప్రగతికి కారణమతడే ॥ఈశ్వ॥

# ఒకే జాతి

ఒక పూవు కాజాలదు పూలమాల
ఒక మొక్క కాలేదు వనం
ఒక మనిషితోనే కాదు జాతి.

పువ్వుల బట్టి మాలలాగ
మొక్కల బట్టి తోటలాగ
మనుషుల బట్టి ఉంటుంది దేశం.

భాష, వేషం, కులం, మతం
కారాదు కంచెలు జాతి సమైక్యతకు
ఎన్నో మొక్కలు, పూవులు ఒక తోటలో వెలిసినట్లే
అన్ని భాషలు, అన్ని మతాలు వర్ధిల్లాలి దేశంలో.

భాషలెన్ని మాట్లాడినా
భావం ఒక్కటే
ప్రతినిధు లెందరున్నా
ప్రజలంతా ఒక్కటే.

మతాలు ఎన్ని ఉన్నా
మనుషులందరికీ దేవుడు ఒక్కడే
అందరం అలా అనుసరించిన నాడే
అవుతుంది మనది ఒకేజాతి.

# తొందరపాటు

ఏ పని చేసినా
ఆలోచించి చేయాలి
ముందు వెనుకలు చూడవిదే
ముందడుగు వేయరాదు.

మంచి పెద్దలు విచారించి
మరీ చెయ్యాలి పనులు
పరుగెత్తి పాలు తాగేకంటే
నిలుచుని నీళ్ళు తాగడం మేలు.

అడ్డుదారి ఆపదలకు మూలం కావచ్చు
చుట్టుదారి అయినా సులభంగా వెళ్ళమన్నారు
తొందరపాటు ఎందుకూ మంచిది కాదు
అడుసుతొక్కి కాలు కడిగినట్లు

చేయి కాల్చుకుని ఆకులు పట్టుకున్నట్లు
తొందరపడి తప్పు అడుగువేస్తే
మళ్ళీ తప్పుకోవడం కష్టం
తొందరపాటు అన్నిటికీ చేటు—అందరికీ అనర్థం.

# చీమ

చూడడానికి చిన్నదైనా చీమ
తెలివిలో బహుమిన్న అది
వానాకాలానికి దాస్తుంది
ధాన్యాలను వేసవి నుండే -

ఉండాలని హాయిగా
కడుతుంది పుట్టల మేడలు
చేరుతాయి పాములు చివరకు అందులో
తమకు సరిపోయే చిన్న పుట్టలు పెట్టుకుంటే
చేరలేవు పాములు వాటిలో.

తమకు చాలినంతే సంపాదిస్తే
ఉండదు దోపిడీల ప్రమాద భయం.
అందుకే అంటాం
"చీమలు పెట్టిన పుట్టలు
పాములకు ఇరవైన యట్లు"- అని
ఒకరు చేసిన కృషి ఫలితం
మరొకరికి చెందినప్పుడు.

చీమల్లో ఉన్న సంఘీభావం
మానవుల్లో ఉంటే మరోవిధంగా ఉండేవాళ్ళం.

చీమలనుండి నేర్చుకోవాలి
మనుషులు ఎన్నో పాఠాలు
రేపటికి కావలసినంత దాచుకోవడం
అందరం కలసి ఐక్యతతో జీవించడం

# పెళ్ళి

పెళ్ళి అంటే వేళాకోళపు మేళం కాదు
అదొక పెద్ద జీవిత కథ
పెద్దవాళ్ళయ్యాక పెళ్ళి అంటే ఏమిటో
పిల్లలుగా ఉన్నప్పుడే తెలుసుకుంటే మంచిది.

పెళ్ళి చేసికున్న తర్వాత
పుట్టుతారు పిల్లలు
అమ్మ, నాన్న, పిల్లలు కలసి ఉంటే
అవుతుంది కమ్మని కుటుంబం.

పెళ్ళి మాత్రం కాదు బొమ్మల ఆట
తెలివి తక్కువ పెద్ద వాళ్ళు బలవంత పెట్టినా
పిల్లలు త్వరపడకండి పెళ్ళి కోసం
ఒప్పుకోరాదు పిల్లలు పెండ్లికి
చదువులు పూర్తి చేసేవరకు
చక్కగ జీవనోపాధి కలిగే వరకు.

ఆ పైని అన్నీ పిల్లలకే తెలుస్తాయి
విచారించి చేసుకోవచ్చు పెళ్ళి
హాయిగా వాళ్ళ ఇష్టప్రకారం
గడపవచ్చు కాలం ఆనందంగా.

# బండిచక్రం

బండిలేక ఉండేదా ప్రగతి ?
బండిచక్రం కనిపెట్టడమే
నాగరికతకు పునాది
బండి రెక్కలను ఎక్కితేనే
చేరగలుగుతాం, అనుకున్నచోటికి.

చక్రం కనుగొన్నవాడు
చక్రి కంటే ఘనుడు
చక్రం మూలంగానే
సక్రమంగా నడుస్తుంది జగం.

చక్రం వక్రమైనా
దానికిలేదు వక్రబుద్ధి
ప్రకృతితో చేయికలిపి
చక్రం చేస్తుంది మేలు జగానికి.

చక్రాన్ని చేయిదాల్చి
వక్రులను తుంచాడు చక్రి.

చక్రం లేనిదే నడపలేం పరిశ్రమలు
చలనమే ఉండదు యంత్రాలకు
సాగలేదు ప్రగతి జగతిలో.

చక్రాలు అక్కరలేని
బండ్లెన్నో వచ్చినా
బండి, బండి చక్రాలు లేకుంటే
నిలిచేదా మానవ చరిత్ర నేటికి ?

# పేదరికం

పేదరికం కాదు పేదవాళ్ళ తప్పు
ఉన్నవాళ్ళు కాదు గొప్ప
లేనివాళ్ళు కాదు తక్కువ.

పేదవాళ్ళను బాధించరాదు
బీదవాళ్ళను వేధించరాదు
పేదరికం పోవాలి
అందరం సమానం కావాలి
అందుకు అందరం పాటుపడాలి.

మంచివాళ్ళు ఉంటారు అందరిలోనూ
పేదవాళ్ళలోను ఉంటాయి మంచిగుణాలు
పేదరికం కాదు పేదవాళ్ళ తప్పు
అది ఆర్థిక విధానంలో లోటు మాత్రమే.

పక్కవాళ్ళు పడుతుంటే బాధలు
చూడలేం హృదయం ఉంటే
శరీరంలో ఒకభాగం జబ్బుపడితే
కాదా బాధ శరీరానికంతటికీ ?

అలాగే,

సంఘంలో అసమానత్వం
అవుతుంది శాద్యం సమాజానికి
దాన్ని తొలగించకుంటే
పోతుంది సంఘం క్షీణించి.

# చదువు

చదవడం జీవించడం
చదువు మానడం మరణించడం.
చదవడం అనుభవించడం
చదువు ఆపడం అనుభూతి లేకుండడం,
చదవడం వల్ల నేర్చుకుంటాం
చదవనందువల్ల అజ్ఞానంలో ఉంటాం.
చదువువల్ల తెలుసుకుంటాం
ఇతరుల అనుభవాలు.
చదవకుంటే తెలుసుకోలేం
ప్రపంచంలోని అనేక విషయాలను.

అందుకే తప్పక చదువు నేర్వాలి
ప్రపంచ విజ్ఞానాన్ని పొందాలి.

# దేశం కోసం

దేశం కోసం నడవాలి
మనదేశం కోసం కదలాలి
మాటలతోనే పని కాదోయ్
పాటలతోనే పని కాదోయ్
చెరగని మన దేశభక్తిని
చేతలతో చూపాలోయ్ ॥దేశంకోసం॥

దేశ సమగ్రత కోసం
సమరం సలిపే వీరులు కావాలోయ్
జాతి సమైక్యత కోసం
త్యాగం చేసే పౌరులు కావాలోయ్ ॥దేశం॥

వీర జవానుల సంక్షేమం
అందరి బాధ్యత కావాలోయ్
శత్రువు ఎంతటి వాడైనా
మన శక్తికి లొంగక తప్పదులేవోయ్. ॥దేశం॥

పర రాజ్యాలను కబళించే
భావన మనకెన్నడు లేనే లేదోయ్
శాంతి, స్వేచ్ఛల సంరక్షణకే
సమరం సలిపే వీరులు కావాలోయ్ ॥దేశం॥

అడవుల్లో, కొండల్లో
అహోరాత్రముల పోరాటంలో
అశువులు బాసిన జవానులకు
అందరి జేజేలర్పించాలోయ్. ॥దేశం॥

దేశం నీకేమి చేసిందన్నది కాదోయ్
దేశం కోసం నువ్వేమి చేశావో
బాగా ఆలోచించి, మరి ఆచరించాలోయ్. ॥దేశం॥

# ఆంధ్రప్రదేశ్ యాత్ర

ఆంధ్రప్రదేశ్ యాత్రకు వెళదాం
బాబుల్లారా, పాపల్లారా
వింతలు అన్నీ చూచివద్దాం
విశాఖపట్నం విశాల సముద్రతీరం
భారీ పరిశ్రమలు, భలే పెద్ద ఓడరేవు.
గొప్పదైన గోదావరి మహానది వంతెన
రాజమండ్రి, కాకినాడ, నగరాలు
కన్నుల పండుగ వరిచేలు, అబ్బురమైన కొబ్బరి తోటలు.
కృష్ణా నదిపై ప్రకాశం బారేజి, బందరు కలంకారీ, విజయవాడ పట్టణం
గుంటూరు దొరపొగాకు, పలనాటి శౌర్యపటిమ.
శ్రీశైలం, కాళహస్తి, కాళేశ్వరం,
తిరుపతి, అన్నవరం పుణ్యక్షేత్రాలు.

రాయలు ఏలిన రతనాల సీమ
వజ్రాలకు ఖనిజ సంపదలకు నిలయం
పోచంపాడు, నాగార్జునసాగరు ప్రాజెక్టులు
ఆదిలాబాదు అడవులు, సింగరేణి బొగ్గుగనులు
ముమ్మర పరిశ్రమల వాటికలు అనేకాలు.
వరంగల్లు కాకతీయ విశ్వవిద్యాలయం
అమరావతి, నాగార్జున కొండల బౌద్ధ సంస్కృతి చిహ్నాలు
కొండపల్లి బొమ్మలు, కరీంనగరు వెండి నగిషీ
అన్ని కళలకు ఆలయం మన రాజధాని
అందాలు చిందే హైదరాబాదు నగరం.

# తరగతి

క్లాస్‌లో అందరు పిల్లలు
పాస్ కావాలి పరీక్షలు
బాగా చదువుకొని
పాఠాలు నేర్చుకొని
కాపీలు కొట్టకుండా
టీచర్లను తిట్టకుండా
పాస్‌కావాలి పిల్లలు అందరూ-
ఉండాలి పిల్లలు క్లాసులో ఐకమత్యంగా
పాటించకుండా ఎట్టి భేదాలు.

ఎక్కువ మార్కులు వచ్చే పిల్లలు
తక్కువ మార్కులు వచ్చే వాళ్ళతో
ఓర్పుతో మెలగాలి
నేర్పుతో చూడాలి వారిని తమతో సమంగా

చాడీలు చెప్పడం
పుస్తకాలు, పెన్నులు దొంగిలించడం
పనికిరాని పనులు పిల్లలకు.

మొక్కగా వంగనిదే మానై వంగదన్నట్లు
చిన్నప్పటి అలవాట్లు పెద్ద అయినా పోవు
మంచి అలవాట్లు చిన్నతనంలో నేర్చి
గడపాలి మంచి జీవితం సంఘంలో.

# వేళకు

వేళకు నిద్రలేవడం
వేళకు స్నానాదులు కావించడం
వేళకు పాఠశాలకు వెళ్ళడం
వేళకు ఆటపాటల్లో పాల్గొనడం
వేళకు ఇంటికి తిరిగి రావడం
వేళకు పాఠాలు చదవడం
వేళకు భోజనం, నిద్ర
వేళకు మెలకువ, వ్యాయామం
అన్నీ వేళ ప్రకారం అలవాటు చేసుకుంటే
క్రమశిక్షణ మనిషిని
ఎంతటి గొప్పవారినో చేస్తుంది
ఎంతో మంచి పేరు తెస్తుంది.

చిన్నతనంలో క్రమశిక్షణ
వెన్నతో రొట్టె తిన్నట్లే.

# ఏది ముఖ్యం

శరీరంలో ఏదిముఖ్యం
ఉన్నాయి కదా !
కళ్ళు, కాళ్ళు, ముక్కు, చెవులు,
నోరు, నుదురు, పొట్ట, గుండె,
ఇంకా ఎన్నో.

చేతులు అనుకుంటే తమ కృషి వల్ల
పొట్ట తిని బలుస్తుందని
కాళ్ళు అనుకుంటే తమ శ్రమ వల్ల
శరీరం ప్రయాణంచేసి అనుభవిస్తుందని,
కళ్ళు, ముక్కు, చెవులు, నోరు అలాగే
తమ వల్లనే ఇతర భాగాలు
లాభం పొందుతున్నాయని అనుకుంటే
కలిగే నష్టం ఎవరికి ?

కన్ను గుడ్డిదైనా
కాలు కుంటిదైనా
కాదా బాధ శరీరం అంతటికీ ?

కుటుంబంలో, లేవా అందరికీ
పటుపైన బాధ్యతలు ?
ఎవరికివారే ముఖ్యమని
పని చేయడం మానడం
ఎవరికి నష్టం ?
కాదా బాధ కుటుంబం అంతటికీ ?

# సంక్రాంతోయ్ - సంక్రాంతి

## (i)

సంక్రాంతోయ్ సంక్రాంతి
అక్కకు సిగ్గు - బావకు మొగ్గు
మంచి నూనెతో మర్దన చేసి
వేడి నీళ్ళతో తలంటుపోసి
ఆవుపాలతో అన్నం వండి
చక్కెర పొంగలి చక్కగ చేసి
పిండివంటలు మెండుగ చేసి
కొత్త బట్టలు కొల్లగ పెట్టి
బావకు విందు బాగుగ చేసి
పండుగ రోజులు నిండుగ గడిపి
అక్కను బావకు అప్పజెప్పి
అల్లుని మెల్లగ సాగనంపే ॥సం॥

అల్లుళ్ళకు ఆనందం కలిగించే సంక్రాంతి
అందరికీ సరదా కలిగించే సంక్రాంతి. ॥సం॥

# సంక్రాంతి పండుగ (II)

వస్తుంది సంక్రాంతి
తెస్తుంది అందరికి క్రాంతి
ఇస్తుంది సంతోష సంపదలు
కలిగిస్తుంది ప్రజలకు హాయి
వింపుతుంది కర్షకుల పాతరలను
అందిస్తుంది కార్మికుల కష్ట ఫలితాన్ని చేతికి.
కొత్త బట్టలు వేస్తారు
పిండివంటలు చేస్తారు
కడతారు బంతిపూల తోరణాలు
చేస్తారు పశువులకు అలంకరణలు
కావిస్తారు బళ్ళ పూజలు
నాగళ్ళ కొలువులు.
వేస్తారు రంగు రంగుల ముగ్గులు
జరుపుతారు పలువిధాల సంబరాలు.
పిలుస్తారు అల్లుళ్ళను, కూతుళ్ళను
పలుకరిస్తారు బంధుమిత్రులను
సంక్రాంతి పండుగకు.
ఏటేటా తెలుగునాట వెలుగు సంక్రాంతి
విస్తరించాలి పేదల గుడిసెల్లోకి
సంక్రాంతీ ! ప్రతి ఏటా నీవు రావాలి
తేవాలి ప్రజలకు సుఖ సంతోషాలను
మురిపించాలి సిరి సంపదలతో
మరిపించాలి కర్షక కార్మికుల కడగండ్లను.

# కలం చెప్పిన కథ

చిట్టిబాబు రాస్తున్నాడు
కష్టంతో కలం పట్టుకొని
రాయలేనప్పుడు కొట్టుతున్నాడు
కలాన్ని నేలకేసి
ఆ బాధకు తట్టుకోలేక
కలం చెప్పింది తన కథను -

"- నీకూ ఉందా ఒక కథ
చెప్పు విందాం" - అన్నాడు
చేసే హోంవర్కు ఆపివేసి -

"- ఉంది బాబు నాకూ ఒక కథ
అసలు ఆదిలో
అక్షరం నేర్చిననాడు
చేతి వేలితో రాసేవారు ఇసుకపైన.
తర్వాత అక్షరాల్ని
వాక్యాల్ని దాచుకోనేర్చారు
మట్టి బిళ్ళలపై, చెట్టు తాటలపై
జంతు చర్మాలపై.
ముళ్ళతో, ఎండు పుల్లలతో
రాతిముక్కలతో రాసేవారు.

కనిపెట్టారు ఇనుప గంటాలను
ఇంకా కొంతకాలానికి
తాటాకులపై రాయడానికి
అదే నా అసలు కలానికి స్వరూపం.

ఆదికవులు వాల్మీకి, వ్యాసుడు, కాళిదాసు
మన నన్నయ, తిక్కన, పెద్దన, తిమ్మనలు
రాశారు వాటితో గ్రంథాలు
వాడారు బూర్జ పత్రాలను, కరక్కాయ సిరాను.

కాలం గడిచిన కొద్దీ
చెత్తతో చేశారు చిత్తు కాగితాలు
వాటిపై రాశారు
కరక్కాయ, నీలిరంగు సిరాలతో
పక్షి ఈకల కలాలతో.

ఆ ఈకలు ఎంత సౌందర్యం!
ఇప్పటికీ కళాకారులు ఉంచుకున్నారు
వాటిని అందానికి చిహ్నంగా.

శరీరానికి అవయవాల లాగే
వ్రాతకు కావాలి కలం, కాగితం, సిరా.

బాబూ విన్నావా నా కథ
రాసుకోవాలి నాతో అందంగా
అడుకోరాదు నన్ను నేలకేసి కొట్టి
అని ముగించింది కలం తన కథను.

# రాసే - సిరా



అబ్బాయి వచ్చాడు బడినుండి
ఒళ్ళంతా రాసుకున్నాడు
రాసి, రాసి, సిరా.
అమ్మకు వచ్చింది కోపం
అబ్బాయికి అంటించింది రెండు.
ఆలోచించాడు అబ్బాయి
గోక్కున్నాడు బోడిగుండు
ఎందుకు సిరా పూసుకుంటే వదలదు - అని

సిరా ఓదార్చి చెప్పింది తన కథ

చిట్టి అబ్బాయి, ముద్దుల పట్టీ
కోపగించకు నాపై
సిరాకు ఉన్నది పెద్ద చరిత్ర
సిరా లేకుంటే రాసేదే లేదు అని.
సిరా లేకుంటే కలానికి
దానితో రాసే కాగితానికి
స్నేహమే లేదు - అని తెలుసా నీకు ?
తుడిస్తే పోయే సిరాతో రాస్తే
ఉండేవా మన సాహిత్య కళాఖండాలు
మన ఇతిహాసాలు, కావ్యాలు !

అబ్బాయి అన్నాడు -
అబ్బో బహుగొప్ప !
అంతా నీదే అన్నట్లు చెపుతున్నావే
కలం, కాగితం లేకుంటే
నీ ఉపయోగం ఏముంది - అని

ముద్దుల తుప్పా - రాశారు గంటంతో
తాటాకుల గ్రంథాలు
కనిపెట్టారు కాగితాలు
కలంతో రాస్తేనే కాని వీలుకానివి
కలం కదలగలదా సిరా లేకుండా

మరి సిరా తుడిస్తే పోయేలా ఉంటే
ఉంటాయా పుస్తకాలన్నీ తరతరాలుగా -

అబ్బాయి అన్నాడు -

నిజమే సిరా,
ఒప్పుకున్నా నీ గొప్ప
మరి నా చొక్కా మీద సిరా
పోయేదెలాగు ?

చెప్పింది సిరా జవాబు -

నిజమే బాబు నీవు చెప్పింది.
నిమ్మకాయ రసంతో కడుగు
వదులుతాను కొంతవరకు
అంతకు మించిన సలహా
ఆడుకోకు సిరాతో.
సిరా రాసుకోడానికే కాని
పూసుకోడానికి కాదు సుమా !

# తేనెటీగ నుండి నేర్చుకుందాం

తేనె ఎంతో తీపి రుచి చూస్తే
దాని కథ ఎంతో వింత మరి వింటే
తేనెటీగలకు ఇంత తెలివి ఉందా అనిపిస్తుంది వాటిని చూస్తే.
చెట్టు కొమ్మలకు, కొండ శిఖరాలకు
తేనెతుట్టెలు ఉంటాయి వేలాడుతూ.
పిల్లలనుకుంటారు
వాటిని దేవుడే అంటించి ఉంటాడని.
అర్థం అవుతుంది అసలు కథ
ఆలోచించి తెలుసుకుంటే.

తేనెటీగలకు ఉంటుంది పెద్ద పరిపాలనా యంత్రాంగం
ఒయ్యారాల రాణిఈగ ఉంటుంది అన్నిటిలో పెద్దదిగా
సోమరిపోతు మగఈగ రాణితో ఎల్లవేళలా
చేస్తుంది ప్రణయం
దాది ఈగలు చేస్తాయి సేవలు రాణికి
సిపాయి ఈగలు కల్పిస్తాయి రక్షణ తేనెపట్టుకు.

రాణి పెడుతుంది వేలకొలది
ఆణి ముత్యాల్లాంటి గుడ్లను
అవే అవుతాయి తరవాత తేనెటీగలు కొల్లలుగా
తేనెటీగలు బారులుతీరి వెతుకుతాయి పువ్వులను
చేరుస్తాయి పుప్పొడిని మగపుష్పాలనుండి ఆడపుష్పాలకు

అందువల్ల కాస్తాయి కాయలు
పండుతాయి పంటలు.

తెస్తాయి తమ తొండాలనిండా తేనెను
నింపుతాయి తేనెపట్టు గదులను
అందిస్తాయి మనకు అమృతంలాంటి తేనెను.

మానవ సమాజంలో లేదు అలాంటి సహకారం
అందుకనే మనిషి ఎంతో నేర్చుకోవాలి
తేనెటీగల జీవితం నుండి
మంచిగా మనుగడ జరపాలంటే
సాంఘిక జీవితం చక్కగా గడపాలంటే.

# వేళాకోళం

వేళాకోళంలో సరదా ఉన్నా
ఉండాలి దానికి వేళా పాళా
వేళాకోళం ఎవరితో

ఎప్పుడు?
ఎక్కడ?
ఎందుకు?
ఎలా?

అని తెలుసుకుంటే
ఉంటుంది అందులో అందం.

వేళాకోళం వినియోగిస్తే సరిగా
మార్చవచ్చు మనుషుల మనసులను.

వేళాకోళం అనే పూదోటలో
వెదజల్లవచ్చు నవ్వుల పువ్వుల పరిమళం
కురిపించవచ్చు హాస్యపు పన్నీరు జల్లులు.
శ్రుతిమించితే వేళాకోళం
చేకూరవచ్చు అపదలు-అపార్థాలు.

వేళాకోళం బెడిసికొడితే
పూలతోటలో గాలివానలా
శాంతి సముద్రంలో తుఫానులా
పచ్చిక బయళ్ళలో ముళ్ళపొదల్లా
హాస్యం మారవచ్చు విషాదంగా
సంతోషం మారవచ్చు దుఃఖంగా.

# పాపా నీకు తెలుసా ?

తుమ్ముకూ, దగ్గుకూ
పిల్లి నడకకూ
బల్లి పలుకుకూ
కాకి ఎగరడానికి
గద్ద వాలడానికి
మనం చేసే పనులకు
ఎలాంటి సంబంధం లేదని
పాపా నీకు తెలుసా ?

వారంలో ఏడు రోజులు
ఏడు రకాలు కాదనీ
ఆదివారం నుండి
శనివారం వరకు
అన్నిరోజులు మంచివేనని
రోజుల్లో కొన్ని గంటలు మంచివీ
మరికొన్ని చెడ్డవీ - లేవని
పాపా నీకు తెలుసా ?

సాటివారిని ద్వేషించడం
పొరుగు వారిని పీడించడం
ఇతరులపై ఈర్ష్య అసూయలు పెంచుకోవడం.
కోపంవల్ల నష్టమనీ

రోషంవల్ల దుఃఖం అనీ
పాపా నీకు తెలుసా ?

చందమామ దేవత కాదనీ
సూర్యుడికి అదొక ఉపగ్రహమనీ
దానిపై బ్రతకడమే కష్టమనీ
అక్కడికి మనుషులు వెళ్ళి
రాళ్ళు మట్టి తెచ్చారనీ
పాపా నీకు తెలుసా ?

కులం మతం
మనుషులే కల్పించారనీ
అంటరాని వారెవరూ లేరనీ
అందరమూ సమానమనీ
హెచ్చు తగ్గులు పెంపకంలోనే కాని
పుట్టుకలో లేవనీ
కులం కంటే గుణమే ప్రధానం అనీ
పాపా నీకు తెలుసా ?

మనుషులను దూరంగా ఉంచి
పాములను పశువులను
పూజించడం మూఢ నమ్మకం అనీ
పాపా నీకు తెలుసా ?

ముడుపులూ మొక్కుబడులూ
స్వార్థపరుల మోసాలనీ
దేవతల తృప్తికి జంతుబలులు
అర్థంలేని నమ్మకాలనీ
పాపా నీకు తెలుసా ?

# మామిడి

తింటే ఉంటుంది
మామిడిపండు ఎంతో కమ్మగా
పచ్చికాయ తింటే ఉంటుంది పులుపుగా
పిందెలు తింటే ఉంటుంది లోపల జీడి
జీడి తగిలితే అవుతుంది నోరంతా పుండు.

చేసుకోవచ్చు పచ్చి మామిడితో రకరకాల పచ్చళ్లు
చిచ్చులో కాల్చి చేయవచ్చు మామిడి పానీయాలు.
ఉప్పు కారంతో ఉరకలు వేస్తూ
రుచి చూడవచ్చు ఊరగాయలు అనేకాలు.
పండు రసాలను
పాయసంలా జుర్రుకోవచ్చు.

మామిడిలో ఉన్నాయి అనేక రకాలు
బేనీషా, నీలం, జహంగీర్ అక్బరు రాజుల పేర్లతో సహా.
పండ్లల్లో రాజు మామిడిపండు.

మామిడి ఆకులతో కడతారు, తోరణాలు
పండుగలకు, పెళ్ళిళ్లకు.
మామిడి పువ్వు తేనెటీగలకు పసందు
మామిడి చిగుళ్లు కోకిలలకు విందు.

వింటే పసిపిల్లల బోసినవ్వుల పాటలు వినాలి
తింటే మామిడిపండ్లే తినాలి అంటారు.

మామిడి పండ్లకై పోట్లాడరాదు మనం
మామిడి పండులా ఉందాం తియ్యగా, కమ్మగా.

# ఇంజెక్షన్



ఆటల్లోపడి ఒంటికి దెబ్బ తగిలినప్పుడు
కాళ్ళల్లో ఇనుప మేకులు
గాజు పెంకులు గుచ్చుకున్నప్పుడు
కుక్క కరిచినప్పుడు
ఎలుక కొరికినప్పుడు
కోరింత దగ్గుకు
గొంతువాపుకు
తీసుకోవాలి
ట్రిపిల్ యాంటిజన్ ఇంజక్షన్

గాయాలు చెల్లి పారకుండా ఉండడానికి
కోరింత దగ్గును తగ్గించడానికి
గొంతువాపును మాన్పడానికి-

పోలియో జబ్బుకు అవసరం మాత్రలు
కాళ్ళు చేతులు చచ్చుబడకుండా-

అమ్మవారు అనే స్ఫోటకం జబ్బును ఆపడానికి
మహమ్మారి అనే కలరాను దూరంగా ఉంచడానికి
కావాలి రకరకాల మాత్రలు సూది మందులు.
సూదిని చూచి భయపడతారు పిల్లలు
కాని భయపడరు కిందా మీద దూకి
కాళ్ళు వేళ్ళు విరగ గొట్టు కోవడానికి
చీమ కుట్టినంత నొప్పి అయినా లేని
సూది మందుకు వేస్తారు వెర్రికేకలు
చేస్తారు గందరగోళం.

ఇంజక్షన్ వల్ల ఉన్నాయి
లాభాలు అనేకాలు
ఉన్న జబ్బులు మానుతాయి
కొత్తరోగాలు ఆగుతాయి.

# ఈత

నీరు మంచిదే అయినా
లోతు తెలియందే
ఈత రాందే
దిగరాదు నీటిలో.
నీటిలోని ఆటల కన్నా
ప్రాణాలు ముఖ్యం గనుక-

అయినా ధైర్యంతో
నేర్పరుల సహాయంతో
అపాయంలేని లోతుల్లో
తప్పక దిగి చూడాలి
ఈతను నేర్చితీరాలి
ఈత అవసరం విలువ కట్టరానిది
ప్రాణ రక్షణకు ఎన్నో సందర్భాల్లో
అన్ని విద్యలు నేర్చిననాడే
మనిషి మనిషిగా తయారుకాగలడు
మానవుడిగా జీవించగలడు
కారణం లేని భయం తప్ప
ఈత నేర్వడంలో లేదు ముప్పు.

# ఎండ

ఎండ వల్ల ఉన్నాయి
ఎన్నో ఉపయోగాలు
ఎండ లేందే లేదు వెలుతురు
ఎండ లేందే ప్రాణికోటికి లేదు జీవం.

ఎండ వల్లనే ఉంటుంది పరిసర పరిశుభ్రత
ఎండ వల్ల మంచు కరిగి ప్రవహిస్తాయి నదులు
ఎండ వల్ల కొండలు బయటకు వేస్తాయి పచ్చిక
ఎండ వల్ల నీరు ఇంకి మేఘాల్లో కలసి కురుస్తుంది వర్షం.
కాని, ఎండ ఎక్కువైతే ఉండాలి జాగ్రత్తగా
కావాలి చల్లని పానీయం, చల్లని గాలి
వడదెబ్బ తగలకుండా.

ఎండల్లో ఎన్నో చోట్ల మంచి నీళ్ళకే కరువు వస్తుంది
కొన్ని చోట్ల ప్రాణికోటికే హాని కలుగుతుంది
ఎడారిలో బ్రతుకే దుర్లభం అవుతుంది
అయినా ఎండ బాధలను ఓర్చుకోవచ్చుగాని
ఎండ లేకపోతే లేదు జీవకోటికి ప్రాణం.

# వాన

వాన కురిస్తేనే వరిపంటలకు నీరు
చినుకు పడితేనే చిల్లర పైర్లకు తడి

ధాన్యాలు పండితేనే
ఇంట్లో వంటలు
వంటికి దుస్తులు
బడిలో చదువులు
దుకాణంలో సరుకులు
ఉంటుంది ధనం.

వర్షం లేనిదే వాగులు పారవు
వాగులు పారనిదే చెరువులు నిండవు
నీరు లేనిదే. పైరులు పండవు
పైర్లు పండనిదే ధాన్యం ఉండదు
ధాన్యం లేనిదే ధనం లేదు
ధనం లేనిదే అన్నం లేదు

ధనం లేనిదే విద్య, వైద్యం,
మనిషికి మనుగడ, అన్నీ సున్నా.

# కాకి-కోకిల

కాకి చేసిన పాప మేమిటో
కోకిల చేసిన పుణ్యమేమిటో
కాకి గూటిలో కోకిల గ్రుడ్లు పెట్టినా
కోకిల పిల్లలను కాకి పెంచినా
కొనియాడుతారు కోకిలనే అందరూ
కోపగించుతారు కాకి అంటేనే।

కాకి నలుపే-కోకిల నలుపే
కాకికీ కోకిలకూ తేడా
కూతలో మాత్రమే కాదా?
అందంగా మాట్లాడిన వారందరూ
అవుతారా మంచివాళ్ళు।

కాకి చేసిన అపకార మేమిటో
కోకిలమ్మ ఒరిగించిన ఉపకారమేమిటో।
కనలేని కారణం కాదా
కాకిని ద్వేషించడం
కోకిలను భూషించడం।

అర్థంలేని అనురాగాలు, ద్వేషాలు
ఉంటాయి ఇలాగే లోకంలో.

# మనిషికి దూరం

ప్రపంచ పరిస్థితు లన్నిటినీ
పరిశీలిస్తాడు మనిషి,
ప్రక్క ఇంటివారి బ్రతుకు మాత్రం
పట్టించుకోడు మనిషి।

చంద్రుడు లక్షల మైళ్ళ దూరంలో ఉన్నా
చేరుతున్నాడు దగ్గరకు మనిషి,
ప్రత్యక్షంలో ఉన్న తోటి మానవుడిని మాత్రం
ఉంచుతున్నాడు దూరంగానే మనిషి।

పూజిస్తాడు మందలోని గోవును మనిషి
పోస్తాడు పాలు పుట్టలోని పాముకు మనిషి
మనిషిని మాత్రం అంటలేదు మనిషి।

అన్నిటికీ దగ్గరే మనిషి।
మనిషికి మాత్రం దూరం మనిషి।

# గర్వం

ఇతరులకన్న తానే మిన్న అని
అనుకోవడమే గర్వం,
తనను తాను పొగడుకోవడం
పరులను కారణం లేకుండా నిందించడం
గర్వానికి ఉన్న గుణాలు.

తెలివి తక్కువతనం గర్వానికి ఆహారం
తానే గొప్ప అనే భావం గర్వానికి సింహాసనం.
గర్వం పెంచుతుంది
ఇతరులపై ద్వేషం.
గర్వం చెడ్డ గుణాలకు ద్వారం.
తమలో తప్పు కనుపిస్తుంది గర్వం అందరిలో!

గర్వానికి పొగడ్త నిప్పుకు పెట్రోలు లాంటిది!
కాని తన గొప్ప తాను తెలుసుకోవాలి మనిషి.
అందుకే తనను గూర్చి తనివి పొందలేనివాడు
ఇతరుల గొప్పను గుర్తించలేడు
చేదులాగే అతి చిన్న మోతాదులోనైనా
అవసరం గర్వం ప్రతి ఒక్కరికీ!

# ఓపిక

ఓపిక ప్రధానం మనిషికి
ఓపిక లేనిదే విజ్ఞానం పొందలేం.

కోపాన్ని తుంచుకొని
ఓపికను పెంచుకుంటే
మనసును విశాలం చేసుకోవచ్చు
మంచిగా జీవించవచ్చు.

మనిషిని చూడవచ్చు మనిషిగా
ఓపిక లేనిదే కలసి మెలసి మెలగలేం ఇతరులతో.
ఓపిక ఆరోగ్యానికి
ఆనందానికి మంచి ఔషధం.

# వేమన

వేమన మహా యోగి
ప్రజల భాషలో చెప్పాడు పాఠాలు.
అందరికి అవసర మైన
బోధనలను నేర్పాడు అచ్చ తెలుగులో.
వెలిసాడు కవులలో మహాకవిగా
సంఘంలోని దురాచారాలను
విమర్శించాడు విపులంగా.
ప్రసిద్ధిగాంచాడు ఎనలేని సంఘ సంస్కర్తగా
అందించాడు
అందరికి అవసరమైన విజ్ఞానాన్ని.
చూపించాడు
లోకానికి వెలుగు మార్గం.
పొందాడు అమరత్వం
నిలిచాడు తెలుగు నాటి వెలుగుగా.
వేమనను మించిన యోగిగాని
ఆయన చెప్పిన సూక్తుల మించిన విజ్ఞానంగాని
లేవన వచ్చు నేటివరకు.
వేమన చెప్పిన వేదాంతం
అవసరం ఎప్పుడూ అందరికీ.

# పౌరుడు

ప్రజారాజ్యంలో పౌరుడి కర్తవ్యం
ప్రతి ఒక్కరు తెలుసుకోవాలి.
కన్నులు తెరచి చూడాలి
పన్నులు సరిగా కట్టాలి.

కష్టించి కృషి చేయందే
కాయం వంచి శ్రమించందే
ఫలితాలు చేతికి అందవు అవి
ప్రతి పౌరుడు గుర్తించాలి.

ప్రతి పౌరుడు తన దేశానికి
తన కాలం, తన ఆలోచన
కొంత తప్పక వినియోగించాలి.

ఉద్యోగులు నిర్వర్తించాలి ఉద్యోగ్య ధర్మం
ప్రతినిధులు చేయాలి ప్రజాసేవ

అపాలి వ్యాపారులు కల్తీ సరుకులు అమ్మకం
అరికట్టాలి అధిక ధరలను దొంగ వ్యాపారాలను

ఉపాధ్యాయులు చెప్పాలి పాఠాలు బాగుగా
దిద్దాలి విద్యార్థులను సరిగా
విద్యార్థులు నేర్వాలి బుద్ధులు మంచిగా
సిద్ధం కావాలి దేశ సేవకు అందరూ.

దేశానికి కాపలాదారుగా
ఉండాలి ప్రతి ఒక్క పౌరుడూ

మెలకువగా లేకుంటే ప్రజలంతా
వాటిల్లుతుంది స్వాతంత్ర్యానికి ముప్పు అని
ప్రతి పౌరుడు తెలుసుకోవాలి
ప్రజారాజ్యాన్ని పరిరక్షించాలి
దేశాన్ని అభివృద్ధి బాటలో నడపాలి.

# తెలుగు దేశం

మనది తెలుగు దేశం
మనది తెలుగు భాష.
తెలుగు తనంలోనే
ఉంది వెలుగు తనం.

బాల చంద్రుడు
పాపారాయుడు
తెలుగు వీరులు.
కృష్ణ దేవరాయలు,
ప్రతాపరుద్రుడు
తెలుగు పాలకులు.
రుద్రమదేవి, నాగమ
తెలుగు నాయకురాండ్రు
ఆదికవి నన్నయ
అల్లసాని పెద్దన
ఆంధ్ర కవులు.
యోగి వేమన
వీరేశలింగం
తెలుగు సంస్కర్తలు.
గోదావరి, కృష్ణా
తెలుగు నాటి మహానదులు.
నాగార్జునసాగర్
శ్రీశైలం విద్యుత్ పథకం
తెలుగు దేశక్రాంతి దివ్వెలు.

# అట్ట

అట్ట అందం పుస్తకానికి
అది కంటికి ఇంపు.

అట్టలేని పుస్తకం
చొక్కాలేని శరీరం లాంటిది.
త్వరగా మాసిపోతుంది
చూడ చక్కదనం కాదు.
బొమ్మల అట్ట
రంగులచొక్కా లాంటిది
కన్నులకు ఆకర్షణ
మనసుకు ముచ్చట.

అట్ట లేకుంటే
అందమే లేదు
బట్టలులేని శరీరంలాగ
త్వరలో మాసిపోతుంది.
అందం, ఆకర్షణ లేంది
పొందలేం సంతోషం, సంతృప్తి!

# ఎరువు సొమ్ము

హెచ్చులకు, హోదాలకు,
అరువు చేస్తారు! ఎరువు తెస్తారు!
బంధువులు వస్తే సోఫాలు,
స్నేహితులు వస్తే విందులు
"ఊ" అంటే పండుగలు,
"ఆ" అంటే పుట్టిన రోజులు!
పెళ్ళిళ్ళకు విలువైన నగలు,
పేరంటాళ్ళకు పసందైన చీరలు,
అంతు లేని మోజులు
అరువు సొమ్ములపైన!

కనలేరు–ఎరువు సొమ్ము కున్న బరువు!
దొంగల వల్ల, దోపిడీల వల్ల
నీటి వల్ల, నిప్పు వల్ల
మతి మరుపు వల్ల
మన అవివేకం వల్ల.

ఎరువు సొమ్ము పోగొట్టుకుంటే
పరువుకు నష్టం–పర్సుకు భారం.
ఎందుకో తలకు మించిన బరువులు?
ఎరువు సొమ్ములపై ఈ మోజులు!

# ఆకలి ఆకలి ఎందరికో

ఆకలి ఆకలి ఎందరికో
మరి ఆ మాటే తెలియదు కొందరికీ ॥ఆకలి ఆకలి॥

చింపిరి పాతలు ఎందరికో
చీనాంబరములు కొందరికీ ॥ఆకలి ఆకలి॥

గూడే ఉండదు ఎందరికో
మేడలు, మిద్దెలు కొందరికీ ॥ఆకలి ఆకలి॥

నిత్య అవసరాలే తీరవు ఎందరికో
అవసరమంటూ ఉండదు కొందరికీ ॥ఆకలి ఆకలి॥

అంతు లేని దుఃఖం ఎందరికో
అక్కరలేని సుఖం కొందరికీ ॥ఆకలి ఆకలి॥

ఈ అందరితో-ఆ కొందరు
పాలు పంచుకో గలిగితే
మనసు కలుపుకో గలిగితే
ప్రపంచ మంతా శుభోదయం
మనిషి బ్రతుకే కాదా సుఖమయం. ॥ఆకలి ఆకలి॥

(ఆకాశవాణి వారి సౌజన్యంతో-ఈ మానవు పాట)

# అందాల గోదావరి



అందాల గోదావరి
బంగారు గోదావరి
గలగలా పాటేను గోదావరి
మిలమిలా మెరిసేను గోదావరి ॥అందాల గోదావరి॥

నవన కిన్నెర సావి
శబరి చెలికత్తెగా
ఒయ్యారముల తోడ
వెయ్యి మెలికలు తిరిగి

గలగలా పారేను గోదావరి
మిల మిలా మెరిసేను గోదావరి ॥అందాల గోదావరి॥

సరిగమపదనిస-సంగీతం
శ్రుతి తప్పక పాడేను గోదావరి ॥అందాల గోదావరి॥

పాపికొండల నడుమ
పండు వెన్నెలలోన
పరవళ్ళు త్రొక్కేను గోదావరి

మెండైన అడవుల్లో
విందుగా పారేను గోదావరి ॥అందాల గోదావరి॥

అందాల చిందులతో
అందరిని మురిపించు గోదావరి

మోసాలు ఎరుగని
ద్వేషాలు పెంచని గోదావరి ॥అందాల గోదావరి॥
ఆ ఒడ్డునా గిరులు
ఈ ఒడ్డునా తరులు
అడుగడుగునా శిరులు

బంగారు పంటలే పండించి
ప్రజల కన్నము పెట్టు గోదావరి

శ్రీలక్ష్మి గోదావరి-భూలక్ష్మి గోదావరి
అందాల గోదావరి-బంగారు గోదావరి ॥అందాల గోదావరి॥

# గోతులు తవ్వని జీవితం

జంతువులు ఎంతో ఆనందంగాను
సంతృప్తికరంగాను ఉంటాయి
వాటిని చూచిన కొలది
ఇంకా చూడాలని పిస్తుంది।

పన్నులు ఎగవెయ్యాలని ఆలోచించవు।
కోటి జీవికి ఊరికే ముప్పు తలపెట్టవు
పక్కవారికి ఉన్నదని ఏడవవు
తమకు లేదని చింతించవు
పేరు ప్రతిష్ఠలు కావాలని ప్రాకులాడవు
పదవులు చేపట్టాలని ప్రణాళికలు వేయవు।

పోట్లాడుకోవు, భాష, మత విభేదాల గూర్చి
వాదించవు నదీజలాల గూర్చి
హింసించవు ఎవరినీ అకారణంగా —
పాపాలకు పన్నుగడలు వేయవు
పుణ్యాలకు యత్నాలు చేయవు
"అవిలేవని" "ఇవికావాలని" ఫిర్యాదులు చేయవు
పక్కవారి పతనానికి గోతులు తవ్వవు
అందుకే జంతువుల జీవితమే సుఖదాయకమేమో
అనిపిస్తుంది ఒక్కొక్కప్పుడు నిజంగా।

# అలవాట్లు

అలవాట్లు పట్టుదారాలు మొదట్లో
అవుతాయి సులకతాళ్ళు కొంతకాలానికి
అటు పిమ్మట గట్టి పడతాయి
ఉక్కుపగ్గాలుగా ! ఇనుపగొలుసులుగా.

కొత్త అలవాట్లు పట్టుదారాల్లాంటివి
పాతుకు పోయినవి ఉక్కుపగ్గాల్లాంటివి.

పట్టుదారం తుంచడం ఎంత సుళువో
ఉక్కుపగ్గం తెంచడం అంతకష్టం
పట్టుదారం తెగకపోతే
ఉక్కుపగ్గం తెగుతుందా !

అందుకనే —
మంచి అలవాట్లను పెంచుకోవాలి మొదటి నుంచీ
చెడు అలవాట్లను తుంచుకోవాలి ఆదిలోనే.

అలవాట్లు కావాలి సేవకులు మనకు
కారాదు మనం దాసులం అలవాట్లకు !

# తిరిగిరావు

ఆడినమాట రాదు తిరిగి
విడిచిన బాణం రాదు మరలి
గడిచిన కాలం దొరకదు మళ్ళీ
పోయిన అవకాశంచిక్కదు చేతికి.

అందుకే—

ఆడాలి మాటలు జాగ్రత్తగా
వేయాలి బాణం గురిచూసి
గడపాలి కాలం ఉపయోగవంతంగా
చేసుకోవాలి అందిన అవకాశాన్ని
అమృత ప్రాయంగా—
మనకు అనుకూలంగా.

# కన్యాకుమారి

చూడాలి కన్యాకుమారి అగ్రం
సూర్యోదయం వేళ
సాయం సమయ వెలుతురులో.

వివేకానందుడు తపస్సు చేసిన రాయి
మూడు సముద్రాల ముచ్చట కలయిక చోటు
అందాలు చిందే ఆకాశం
ఆనందాన్ని అందుకునే సముద్రతీరం.

రంగు రంగుల ఇసుక తిన్నెలు
మహాత్మాగాంధి అస్తికల మందిరం
మరెన్నో వింతలు.
చూడాలి అందరు కన్యాకుమారి
ఆనందించాలి అచటి అంద చందాలు.

# జోల



రాకెట్టులో ఎక్కరా నాన్న
రాయబారం వెళ్ళరా బాబు—
చందురునిపై తిరిగిరా నాన్న
అందముగ మరలిరా బాబు–

యుద్ధమునకు వెళ్ళరా నాన్న
పెద్ద యోధుడివి కావయ్య బాబు—
బాంబులు వేయనేర్వరా నాన్న
పగవారిని కూల్చరా బాబు—

విమానాలు ఎక్కరా నాన్న
విదేశాలు వెళ్ళిరా బాబు —
ఓడల్లో యాత్రలు చేయరా నాన్న
వడిగాను సముద్రాలు చుట్టిరా బాబు —

ట్రాక్టర్‌తో భూమిని దున్నరా నాన్న
పంటలు విరివిగా పండించరా బాబు —
పంపు సెట్టులు పెట్ట నేర్వరా నాన్న
పైరులకు నీళ్ళు పట్టుగా తోడరా బాబు —

భాషలెన్నో నేర్వరా నాన్న
దేశానికి మేలు చెయ్యరా బాబు —
చదువులెన్నో నేర్వరా నాన్న
చక్కగా నలుగురితో మెలగరా బాబు —

పెద్దవాడవు కావాలి నాన్న
దేశానికి సేవ చెయ్యాలి బాబు —
అందరిలో మిన్నగా మెలగాలి నాన్న
తల్లిదండ్రుల పేరు నిలపాలి బాబు —

గౌతమ గాంధీల బాటను నడవాలిరా నాన్న
శాంతి సౌఖ్యాలు చేకూర్చాలిరా బాబు.

# చేతిరుమాలు

చేతిరుమాలు
మూతికి రక్షణ

ఏడుపు వచ్చినా
కన్నులకు పొగ కమ్మినా
దుమ్ము రేగినా
కంటికి నీరు కారినా
అది కంటికి రక్షణ.

ముక్కులకు జలుబు చేసినా
మురికి వాసన వేసినా
అది ముక్కులకు రక్షణ.

తలపై ధూళిపడినా
ఎండ కాచినా, వేడి చేసినా
తలకు అది రక్షణం అవసరం.

చేతికి మురికి తగిలినా
ఒంటికి చెమట పట్టినా
అది శరీరానికే భలే రక్షణ

చేతిరుమాలు విలువ
చెప్పనలవి కానంత!భలే వింత!

# క్రికెట్ - వికెట్




క్రికెట్ ఆట ప్రధానం అనేక దేశాల్లో నేడు
ముచ్చటగా ఉంటాయి మూడురోజుల ఆటలు వినోదానికి
అందంగా ఆడుతారు ఐదురోజుల "టెస్ట్" పోటీలు.

ఒక్కొక్క జట్టులో ఉంటారు పదకొండు మంది
బాట్ చేసే జట్టులో ఇద్దరే ఉంటారు వికెట్స్ వద్ద
వికెట్‌ను కాపాడుతూ కొట్టుతారు విసరిన బంతిని
తీస్తారు పరుగులు "ఔట్" అయ్యేవరకు.

బంతిపట్టుకొనే జట్టు అందరూ ఆడుతారు మైదానంలో
అందులో ఒకడు "వికెట్ కీపర్"
బంతిని విసరేవాడు "బౌలర్".
కొట్టిన బంతిని మిగిలిన వాళ్ళు
బాట్ చేసే వారిని ఔట్‌చేసి
ఆపుతారు వారు తీసే పరుగులను.

బౌలరు బంతి విసురుతాడు వికెట్లు పడగొట్టడానికి
బంతి నేల తగలకుండా పట్టుకుంటే అవుతుంది "క్యాచ్"
దాన్ని కొట్టిన ఆటగాడు అవుతాడు "ఔట్"
వేసిన బంతి వికెట్టుకుముందు, కొట్టేవాడికాలు తగిలితే
అతడు అవుతాడు "ఎల్.బి.డబుల్.యు"
పదిమంది ఆటగాళ్ళు అయితే ఔటు
ముగుస్తుంది "ఇన్నింగ్స్".

ఒక్కొక్క పక్షం ఆడుతారు ఇంపుగా రెండేసి ఇన్నింగులు
ఎక్కువ పరుగులు తీసిన పక్షం గెలుస్తుంది 'టెస్ట్' ఆట
మొత్తం టెస్ట్‌ల్లో ఎక్కువ ఆటలు ఎవరుగెలిస్తే
వారికి దక్కుతుంది "రబ్బరు" అనే పోటీ గెలుపు చిహ్నం
ఇరుపక్షాలు సమంగా గెలిస్తే అవుతుంది ఆట "డ్రా".
ప్రేక్షకులు వీక్షిస్తారు ఈ ఆట విసుగు లేకుండా

# పని

శ్రమించి పని చేయందే
సాధించలేం విజయాలు

పనిచేయడం శరీర ధర్మం
పని లేకుంటే అవుతాం రోగులం.

కాయకష్టంలో ఉంది గౌరవం
ఏ పని చేపట్టినా లేదు అవమానం.

పనిచేయని వారికి
దేవుడు కూడా చేయలేదు సహాయం.

మంచిపని మరువరానిది
గొప్ప పనులు చేయందే
గొప్పవారు కాజాలరు.

పనితో శ్రద్ధను జోడిస్తే
సోమరి తనం పారిపోతుంది.

పనిలో ఉన్నది పవిత్రత
పనిలో ఉన్నది ఆనందం.
పనిలో ఉన్నది ఆరోగ్యం
పని దేవుడిచ్చిన ఔషధం!

# చింతలు లేని జీవితం

బాల్యం ఒక పవిత్ర స్వర్గం
చింతలు, చీకులులేని జీవితం
తోచింది చేయడం
అనుకున్నది చెప్పడం
ఆటలు ఆడటం
పాటలు పాడటం
అన్నిటినీ తెలుసుకోవడం
అందాన్ని ఆనందించడం—

నిజానికి, అబద్ధానికి
తేడా తెలియక పోవడం
న్యాయం, అన్యాయం
అనే వివరాలు పట్టించుకోక పోవడం
ఉపకారంవల్ల వచ్చేమేలు
అపకారం వల్ల కలిగేహాని
అంతు తెలియక పోవడం—

వ్యాపారం నష్టం అని
ఉద్యోగం ఊడింది అని
అప్పుల వాళ్ళ గొడవలు అని
పన్నుల వాళ్ళ బాధలు అని
విచారం అసలే లేక పోవడం—

అంతా ఒక అందమైన స్వప్నం
ఊహించలేని స్వర్గం !
కాని—
అది "అందాల స్వర్గం" అని
తెలుసుకుండేలోగా
చేయిజారిపోతుంది
చెప్పకుండా అంతమంచి బాల్యం.
తిరిగిరాదు మళ్లీ ఎన్నటికీ !

# వినోదం

కాలం గడపడానికి ఉంటాయి అనేక సదుపాయాలు
ఆటలు ఆడుకోవడం, నాటకాలు వేయడం
నృత్యాలు చూడడం, సంగీతం వినడం
చలన చిత్రాలు, దూరదర్శిని ఇంకా ఎన్నో
వింతలు వినోదాలు దర్శించడం—

మంచివాటిని ఎన్నుకొని ఆసక్తితో చూస్తే
చలన చిత్రాలవల్ల చేకూరగలవు అనేక లాభాలు.
భారతం, పల్నాటియుద్ధం వంటి చరిత్ర ఘట్టాలను
దేశనాయకుల త్యాగాలను, ప్రజాసేవలను
కన్నుల ముందు జరుగుతున్నట్లు చూడవచ్చు.
బడికి వెళ్ళని పెద్దలు కూడా
సినిమాల ద్వారా పాఠాలు నేర్చుకోవచ్చు.
కథల ద్వారా మనిషికి ఎంతో విజ్ఞానాన్ని నేర్పించవచ్చు.
దేశాభివృద్ధిని సాధించవచ్చు.

సినిమాలు చూసి
అందులో ఉన్నదంతా ఆనందించినా
మంచిని మాత్రమే గ్రహిస్తే
పొందగలం అనేక లాభాలు.
లేకుంటే ఉన్నాయి చెడిపోయే అవకాశాలు అనేకాలు

# గాంధీ - జాతిపిత, శాంతిదూత

తెల్లవారి పాలన దాస్యంలో
కృంగిపోతున్న భారతమాతకు
స్వాతంత్ర్యం సంపాదించిన మహనీయుడు
మన జాతిపిత మహాత్మాగాంధీ.
మరఫిరంగులతో బ్రిటిష్‌వారిని ఎదుర్కోలేమని
భారత ప్రజలకు నేర్పాడు గాంధి
సత్యాగ్రహం, సహాయ నిరాకరణ
అనే ఆయుధాలతో పోరాటం.
అహింసకు మారుపేరుగా
ధర్మానికి ప్రతిరూపంగా
న్యాయానికి నోరుగా
దీనులకు దేవుడుగా
అంటరాని వారికి ఆప్తబంధువుగా
పరరాజుల పాలిట బల్లెంగా
భారతమాత స్వాతంత్ర్యానికి
సత్యాగ్రహ సిపాయిగా
వెలిశాడు గాంధీ.
దేశానికే కాక
లోకానికే
నిరూపించాడు గాంధీ
"ప్రేమే సత్యం" అని
"సత్యమే దేవుడు" అని
జాతిపితగా
శాంతిదూతగా
నిలిచాడు గాంధీ.
మనం మరువలేని మహాత్ముడు.

# మనుషులు మారాలి

పనికిరాని పాతను విడనాడాలి
పనికివచ్చే కొత్తను చేపట్టాలి
మారాలి మారాలి
మనమంతా మారాలి.
మన మాటల్లో, మన చేతల్లో
మారుపు రావాలి
చెదరిన మనజాతి
చేరువ కావాలి.
శక్తి సడలిన మనజాతికి
చైతన్యం రావాలి. ॥మారాలి మారాలి॥

ఉంటాయి కొందరికి
ఊరంతా ఇళ్ళు
అందులో ఉండడానికి
మనుషులు ఉన్నా లేకున్నా
కోట్ల కొలది ప్రజలకు
ఆకాశమే గూడు అదే నీడ ॥మారాలి మారాలి॥

మన గుండెల్లో కట్టుకున్న
గూడులు తొలగాలి
మనుషులు ఎదగాలి
మన మనసులు పెరగాలి, ॥మారాలి మారాలి॥

నడవాలి నడవాలి
మనమంతా ముందుకు నడవాలి.
సాగాలి సాగాలి
మనమంతా ముందుకు సాగాలి.

# నవ్వు-నవ్వించు

నవ్వు నవ్వించు ఈ లోకాన్ని
నవ్వులతో కవ్వించు నాకాన్ని
నవ్వులలో ఉంది అందం
నవ్వులలో ఉంది ఆనందం—

నవ్వే వెన్నెలకు మూలం
నవ్వే చీకటికి శూలం
నవ్వే నవనందనం భోగికి
నవ్వే దివ్య ఔషధం రోగికీ—

నవ్వులే ప్రాణాలు పోస్తాయి
మరి కొన్ని నవ్వులే ప్రాణాలు తీస్తాయి
విరులు కురిపించు నవ్వులు ఎన్నో
విషము చిలికించు నవ్వులు మరికొన్ని,

నవ్వులే వెన్నెల పువ్వులై
స్నేహపు కాంతుల దివ్వెలై
లోకంలో వెలుగుతుంటే
శోకమే దూరమగునోయీ—
మన లోకమే కాంతమయ మగునోయీ